Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ జూన్ నెల 13 వ తేది శుక్రవారం [నెం 13 రు.

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమాన దాడులు.

ఈ నెల 4 వ తేది బుధవారంనాడు పగలు బ్రిటిషు విమానములు హాలండు తీరమునందలి జీబ్రుగ్ రేవుపైన తీవ్రముగ దాడిసాగించెను. 500 టన్నుల నౌక యొకటి ప్రేలి మునిగిపోయెను. రేవుకు ఉత్తరంగా 300 టన్నుల నౌక మరియొకటిగూడ బాంబుదెబ్బలచే మునిగిపోయెను. నార్వే తీర ప్రాంతమున 5,000 టన్నుల శత్రు సప్లయి నౌక యొకటి బ్రిటిషు నౌకా విమానముచే ముంచివేయబడెను. బులోన్ మొదలగు ఫ్రెంచి తీరపు రేవులమీదగూడ దాడులు జరిగెను. గురువారంనాడు జర్మను విమానాలు మిడ్లండ్సుపై దాడి వచ్చెను. వానిలో 5 పడగొట్టబడెను.

శనివారమునాడు పగలు నార్వే తీరపువైపున గస్తీ తిరుగుచున్న బ్రిటిషు నౌకా విమానములు 5,000 టన్నుల శత్రు నౌకల రెంటిని ముంచివేసెను. రాత్రి చాల దట్టముగ మంచుపడుచున్నా బ్రిటిషు విమానాలు జర్మను యుద్ధ నౌకా శిబిరమగు బ్రెస్టు రేవుమీదకు దాడి వెడలి వందలి కొలది బాంబులు వర్షించినవి. ఫ్రెంచి కోస్తా పట్టణములమీదను, రేవులమీదనుగూడ బాంబులు వర్షముగ కురిపింపబడెను. అది వారము రాత్రి జర్మనీ పడమటి ప్రాంతములోను, వాయవ్య భాగంలోను బ్రిటిషు విమానాలు పలుతావులలో పెద్ద పేలుడు బాంబుల వర్షించెనని జర్మను అధికారులే అంగీకరించిరి. ఎస్సెన్ డార్టుమండు మొదలగు పారిశ్రామిక పట్నాలలో బాంబులవలన పెద్ద పెద్ద మంటలు లేచి చాల ఫాక్టరీలు శిథిలమైనవి. 9 వ తేది సోమవారంనాడు నార్వే, హాలండు ఫ్రాన్సుతీర ప్రాంతాలలో ప్రయాణములు చేయుచున్న శత్రు నౌకలపైన విస్తారముగ దాడులు జరుపబడెను. 10 వ తేది రాత్రి పెద్ద తరగతి జర్మను యుద్ధ నౌకయగు “ప్రిన్సుయుజీన్” గూడ ‘బ్రెస్టు’ రేవులో వచ్చియున్నదని తెలిసి, వందలకొలది విమానాలు ఆ రేవుపై దండెత్తిపోయి వేలకొలది బాంబులను వర్షించాయి. ఇతర రేవులపై జరిగిన దాడుల సందర్భంలో—డోవరు జలసంధివద్ద ఒక 5,000 టన్నుల జర్మను నౌకపై చాల బాంబులుపడి, అనేక అగ్నిజ్వాలలకు ఆహుతి అయినది.

5 వ తేది రాత్రి స్కాట్లండుపైకి కొలదిగా శత్రు విమానాలువచ్చి అచ్చటచట బాంబులు వేసెను. నష్టము బహు స్వల్పము. 6 వ తేదిన జర్మను విమానాలలో ఒకటి లండను పైకివచ్చెను గాని యెక్కడను బాంబులు వేయలేదు. పగటి వేళ లండనులో విమానదాడి సిగ్నలుకు, ఏప్రిల్ 22 వ తేది తరువాత ఇది ప్రథమము. ఇంగ్లండు ఈశాన్య భాగంలో రెండు ప్రాంతాలమీద కొన్ని విమానాలు బాంబులువేసెను. కాని నష్టము అతి స్వల్పము. రాత్రి మరల కొన్ని విమానములు వచ్చి లండనునందును, దక్షిణ తీరపు పట్నముపైనను బాంబులు వేసెను 7 వ తేదిన బ్రిటనుపై శత్రు విమాన దాడులు చాల స్వల్పముగ మాత్రమే జరిగెను. స్కాట్లండు ఉత్తర భాగమున కొన్ని బాంబులుపడెను. 9 వ తేది రాత్రి చాల జర్మను విమానాలు ఆంగ్లదేశపు ఆగ్నేయభాగంలో చాలసేపు బాంబులు వేసినవి. కొన్ని ఇండ్లకు నష్టం కలిగింది. కొందరు ప్రజలుకూడా హతులైరి. మంగళవారం రాత్రి చాల స్వల్పంగానే అక్కడకూడ బాంబులు పడినవి కాని నష్టం ఎక్కువ కలుగలేదు.

శనివారముతో ముగిసిన వారము రోజులలో ఆంగ్ల దేశముమీద 17 విమానములు పడగొట్టబడెను. జర్మనీపై దాడులలో 13 బ్రిటిషు విమానములు పడగొట్టబడెను మే నెలలో అన్నిరంగములలోను కలపి 450 శత్రువిమానములు పడగొటబడెను. వానిలో 207 బ్రిటనుమీద దాడులలో కూల్చివేయబడ్డాయి, మిగతవి మధ్యప్రాచ్యరంగాలలోను మధ్యధరారంగాలలోను కూల్చివేయబడెను.

### ఆఫ్రికా మధ్యధరారంగాలు.

అబిసీనియాలో (తూర్పు ఆఫ్రికా) బ్రిటిషు సైన్యాలు జిమ్మాదుర్గమును సమీపించు ప్రయత్నంలో ఓమోనదిని 7 వ తేదిన దాటి ఒబలాటి దుర్గమును పట్టుకొనినవి. ఇచట 4,000 మంది ఇటాలియను సైనికులుగూడ ఖైదీలుగా చిక్కిరి. అబిసీనియాలో జిమ్మావద్ద జరుగుచున్న పోరాటంలో 4 ఇటాలియను సైనిక డివిజనులు నిర్మూలింపబడెనని బ్రిటిషు అధికారులు 10 వ తేదిన ప్రకటించిరి.

బ్రిటిషు విమానాలు, లిబియా (ఉత్తర ఆఫ్రికా) లోని శత్రుల బెన్ఘాజీ రేవుమీద రోడ్సు దీవులలోని మగిక్జా అను విమానాశ్రయముమీద 5, 6 వ తేదీలలో దాడి జరిపినవి. రేవును, పట్టణము అంతయు పెద్ద పెద్ద అగ్నిజ్వాలలకు ఆహుతియైనది.

8 వ తేదీ ఆదివారం వుదయము, పాలస్థానములోని బ్రిటిషు సైన్యములును, స్వతంత్ర ఫ్రెంచి సైన్యములును సరిహద్దుల దాటి ఫరానువారి పాలనలోవున్న సిరియామీద దాడి ప్రారంభించినవి. ఈ సందర్భంలో స్వతంత్ర ఫ్రెంచి సేనానియగు జనరలు కాట్రూగారు, సిరియా, లెబనాన్ రాష్ట్రములను స్వతంత్ర రాష్ట్రములుగా ప్రకటించి, అందలి ప్రజలను ప్రభుత్వపై తిరుగబాటుచేసి తమకు తోడ్పడవలసినదని కోరిరి. జర్మనులువచ్చి సిరియాను ఆక్రమింపకుండ చేయుటకుగాను, తాము ముందుగనే, సిరియాను ఆక్రమించుటకు నిశ్చయించుకొంటిమని బ్రిటిషు సేనాని వేవెలుగారు ప్రకటించిరి.

సిరియాలో, చెడిపోయిన నాల్గు విమానాలు తప్ప జర్మను విమానాలుగాని, ఒక్క జర్మను సైనికుడుగాని లేడని ఫ్రెంచి హై కమిషనరగు డెంట్సు సేనాని ప్రకటించి, దాడిని నిరోధింపవలసినదని తన సైనికులకు వుత్తరువు చేశాడు.

ఫ్రెంచి యుద్ధ నౌకలుకొని మధ్యధరా ప్రాచ్యభాగానికి వెళ్లుచున్నట్లు 11 వ తేదిన వార్తలు వచ్చినవి. సిరియా రంగంలో బ్రిటిషు సైన్యాలు 11 వ తేదికి రాజధానియగు డెమాస్కసు పరిసరములను ప్రవేశించినవి. మరియొక బ్రిటిషు సైనికదళం సిరియా రేవగు టైరును ఆక్రమించి,

తీరప్రాంతముమీదుగా ఉత్తరముగా ముందుకు జరుగుచున్నది. ఖీం దుర్గం బ్రిటిషు సైన్యముల స్వాధీనమైనది. ఇరాకు నుండి మరియొక దళం సిరియా ఉత్తర సరిహద్దులమీదుగా వచ్చి కమిష్లా అనే పట్నాన్ని ఆక్రమించాయి.

ఫ్రెంచి సేనలు ఒకమాదిరిగా ప్రతిఘటిస్తున్నాయి. చాల వందల ఫరాసు సైనికులు నాయకులు మిత్రమండలి వైపునకు వచ్చి చేరుచున్నారు. పాలస్థానంలో హైఫా రేవుమీద జర్మనులు 10 వ తేది రాత్రి దీర్ఘమైన విమాన దాడి జరిపిరి. క్రిందవున్న బ్రిటిషు నౌకలు కోటలలోని ఫిరంగులుగూడ ఆకాశమంతా అగ్నిగోళాల విరజిమ్ముచు శత్రుల తరుముటకు ప్రయత్నించినవి. ఒక శత్రు విమానం పడగొట్టబడినది.

4 వ తేది రాత్రి, జర్మను విమానాలు అలెగ్జాండ్రియా రేవుమీద భయంకరమగు దాడిజరిపెను. 150 మంది ప్రజలు బాంబులవలన మరణించిరి. 200 మందికి దెబ్బలు తగిలెను. రేవునందలి బ్రిటిషు యుద్ధ నౌకలు 90 నిముషాలు ఆకశమంతా అగ్ని గోళాలతో కప్పివేసి, విమానాలను చెదరకొట్టినవి. దాడి బాధితుల సహాయార్థం ఈజిప్టు ప్రభుత్వం 30 వేల పౌనులను మంజూరు చేసింది. 7 వ తేది రాత్రి అలెగ్జాండ్రియాపై మరియొక దాడి జరిగి 400 వందలమంది ప్రజలు హతులైరి. అరబ్బులు, యూరపియనులు నివసించే ప్రాంతానకి చాల నష్టం కలిగింది. వేలకొలది ప్రజలు యీ నగరాన్ని ఖాళీచేసి వెళ్లిపోతున్నారు.

4 వ తేది బుధవారము రాత్రి శత్రు విమానాలు, మాల్టా రేవుమీద గట్టి దాడిని సాగించినవి. కాని ప్రాణనష్టం ఏమీ కలుగలేదు. మాల్టా గవర్నరు 7 వ తేదిన ప్రసంగిస్తూ క్రీటుపై వలెనే మాల్టా పైనగూడ శత్రులు దాడి వెడలవచ్చుననిరి. కాని దానిని నిరోధించుటకిచట పూర్తియగు సన్నాహాలు జరిగెనని హెచ్చరించిరి.

జర్మనులు స్పైపెస్ చుట్టూవుండే సముద్రమునందు 6 వ తేదిన మందుగనులను మాటుపెట్టిరి.

## ఇటలీ-గ్రీసు.

ముసులోని 10 వ తేదిన ఇటలీ సంగ్రామ ప్రవేశపు వార్షికోత్సవ సందర్భంలో ఉపన్యసిస్తూ యేతెన్సు నగరంతో సహా గ్రీసు దేశమంతాగూడ, ఇటలీచే ఆక్రమింపబడుననీ, ఇకమీద గ్రీసు ఇటలీ సామ్రాజ్యంలో ఒక భాగముగ నుండుననీ ప్రకటించెను.

సంయుక్త రాష్ట్రములను గురించి ప్రసంగిస్తూ ఆ దేశం పైకి ప్రకటించకుండానే యిపుడు యుద్ధం సాగిస్తున్నదనీ, అందుచే అమెరికా యిక యుద్ధంలో ప్రవేశిస్తుందేమో నని తాము క్రొత్తగా భయపడ నక్కరలేదనీ, ముసులోనీ అన్నాడు.

## అమెరికా సంయుక్తరాష్ట్రాలు—అట్లాంటిక్.

అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రజాప్రతినిధి సభవారు 5 వ తేదిన, 40 వేల విమానముల నిర్మించుటకు సొమ్మును మంజూరుచేసిరి. నౌకాధికారులు "అట్లాంటిక్ అండ్ స్టీంషిప్పు" వర్తక కంపెనీవారి నౌకలలో సగభాగమును (375,000 టన్నులు) దేశరక్షణ కార్యములకు స్వాధీనపరచుకొనిరి. జెనరలు మార్షలుగారు శాసన సభలో ప్రసంగిస్తూ అవసరమైతే ఇతర దేశాలలో యుద్ధానికి, సకలాయుధ సన్నద్ధమగు ఒక డివిజను సైన్యము సన్నద్ధముగ నున్నదని ప్రకటించిరి.

ఫ్రాన్సు జర్మనీతో సహకార మొనర్చుటను, అమెరికా సంయుక్త రాష్ట్రములకు శత్రు చర్యగా పరిగణించుచుంటిమని, సంరాష్ట్రముల విదేశాంగ కార్యదర్శియగు కార్డిలు హల్లుగారు ఫ్రెంచి ప్రభుత్వమును హెచ్చరించెను.

ప్రస్తుతం అమెరికా రేవులలోవున్న 80 విదేశీయ నౌకలను స్వాధీనపరచుకొని ఉపయోగించుకొనుటకుగాను గావింపబడిన శాసనమును రూజ్వెల్టు అధ్యక్షుడు 6 వ తేదిన ఆమోద మొసగి అమలులోనికి తెచ్చెను.

ఉత్తర అమెరికా విమాన నిర్మాణశాలలో కార్మికులు హెచ్చు జీతములుగోరి 6 వ తేదిన సమ్మెకట్టిరి. దీనితో ఆయుధ సామగ్రి నిర్మాణశాలలలో సమ్మెదారుల సంఖ్య 528 వేలకు హెచ్చినది. 9 వ తేదిన సైన్యము నుపయోగించి అధికారులీ సమ్మెను చెదరగొట్టిరి. తరువాత కార్మికులు పనిలోకివచ్చి యథాపూర్వంగానే పని చేయుచుండిరి.

వినెంటుగారు (బ్రిటనులో సం. రా. రాయబారి) వాషింగుటనుకు తిరిగివచ్చిన పిదప 6 వ తేదిన, రూజ్వెల్టు అధ్యక్షుని దర్శించి ప్రకటించెను. వినెంటుగారు, జర్మనీతో బ్రిటిషు ప్రభుత్వము గావించుకొనబోవు సంధి షరతులను దెచ్చెనను వార్త పూర్తిగ అసత్యమనియు, ఆంగ్ల దేశంలో సంధి తలంపే యెక్కడను లేదనియు ఖండించెను. వినెంటుగారు బ్రిటనుకు కావలసిన వస్తువులను, అచటి పరిస్థితులను రూజ్వెల్టుకు స్వయముగ తెలియజేసెను.

త్వరలోనే యునైటెడు స్టేట్సు బ్రిటనుకు సరకులను తన నౌకలలోనే పంపగలదని రేమండుగ్లేపరు (ఒక సుప్రసిద్ధుడగు జర్నలిస్టు) దెలిపెను.

అరువు కవులు చట్టంక్రింద 7 క్ష కోట్ల డాలర్ల విలువగల ఆయుధ సామగ్రిని బ్రిటనుకు పంపుట కేర్పాటుచేసితిమని, 20 లక్షల టన్నుల పరిమాణంగల అమెరికను నౌకలను బ్రిటనునకు ఒసగుటకు నిశ్చయింపబడెనని రూజ్వెల్టు అధ్యక్షుడు 11 వ తేదిన శాసన సభలకు సందేశంలో ప్రకటించెను.

"రాబిన్ మూర్" అను అమెరికా సం.రా. నౌక దక్షిణ అట్లాంటికు సముద్రంలో జర్మను జలాంతర్గామిచే ముంచివేయబడెను.

## విషీ.

విషీ ప్రభుత్వ మంత్రివర్గము 6 వ తేదిన సమావేశమై ఆఫ్రికాయందలి ఫ్రెంచి రాజ్యమునకు సంబంధించిన వ్యవహారముల చర్చించెను. వేగాండు సేనానియు, ఆఫ్రికాలోని వేర్వేరు ప్రాంతములోని ఫ్రెంచి గవర్నరులు సేనానులు గూడవచ్చి ప్రభుత్వముతో సంప్రదించిరి. ఈ మంత్రివర్గ సమావేశమున చాల ముఖ్యమగు నిర్ణయము గావించుకొనబడెనని అనుచున్నారు.

సం. రా. విదేశాంగ కార్యదర్శి హల్లుగారు గావించిన హెచ్చరికకు 7 వ తేదిన విషీ ప్రభుత్వము జవాబొసగెను. ఫ్రాన్సు జర్మనీతో సహకార మొనర్చినను అ.సం. రాష్ట్రములకు విరోధముగ నుండు పద్ధతి నవలంబించు నుద్దేశమేమాత్రమును లేదనియు, ఈ సహకారమును దురాక్రమణయనుట సరిగాదనియు, ఫ్రెంచి ప్రభుత్వమందు దెలిపెను.

వాషింగుటనులో ఫ్రెంచి రాయబారియగు హేన్రీహే గారు, అమెరికను విదేశాంగ కార్యదర్శియగు కార్డిలు హల్లుగారి గత గురు శుక్రవారములలో కలసి మాటలాడుటకు ప్రయత్నింపగా హల్లుగారు దర్శన మొసగలేదు. అందుచే హెన్రీగారు పత్రికా ప్రతినిధులపిలచి. మాటలాడుచు, ఎవరెన్ని దుష్ప్రచారములు, అసత్య ప్రచారములను గావించినను, ఫ్రాన్సు తన గమ్యమును వదలదనియు, అమెరికా కది విరోధముగాదనియు నుడివెను.

"క్రూసర్లు" ముందుకు నడచుట.



బ్రిటిషు సైన్యమునకు పలురకముల ట్యాంకులు ఉన్నాయి. ఇవి భయంకరమైనవి. బహువడిగా నడుస్తాయి. విన్యాసముచేయుచు ముందుకు పోవునపుడు వీటిని క్రూసరు ట్యాంకు లంటారు.

సిరియాపై బ్రిటిషు సైన్యములు దాడివెడలెనని తెలియగనే, వెయిగాండ్ సేనాని, అడ్మిరల్ డార్లన్ గార్లు సమావేశమై ఆలోచించుకొనిన పిదప, ఫ్రెంచి ప్రభుత్వము—దాడిని నిరోధింపవలెనని సిరియాలోని ఫ్రెంచి సైనికులకు ఉత్తరువు గావించిరి. సిరియా దాడిని ఆక్షేపించు విషీ ప్రభుత్వం స్పెయినులోని తమ రాయబారిద్వారా బ్రిటిషు ప్రభుత్వమునకు అసమ్మతి పత్రముల నందచేసెను.

వేగాండు సేనాని ఆఫ్రికాకు తిరిగివెళ్లెను. 8 వ తేదీన ఆఫ్రికానుండి ముగ్గురు ఫ్రెంచి సేనానులు, జిబ్రాల్టరులో దిగి అచట బ్రిటిషు గవర్నరుతో సంభాషణల ప్రారంభించిరి.

## నౌకాపోరాటములు.

ఈ నెల మొదటి వారములో, "బిస్మార్కు" అను జర్మను యుద్ధ నౌకను ముంచివేసిన తరువాత, బ్రిటిషు నౌకలకు మూడు శత్రు సప్లై నౌకలును ఒక ట్రాలరును కనిపించెను. ఆ నాల్గిటిని ముంచి వేయబడెను. శనివారమునాడు ఉత్తర సముద్రములో ప్రయాణ మొనర్చుచున్న ఒక శత్రు నౌకల జట్టును బ్రిటిషు విమానము ఎదిర్చి, వానిలో మూడు నౌకలను ముంచివేసెను. శత్రు విమానదాడులవలన 'మషోనా' అను బ్రిటిషు డిస్ట్రాయరు మునిగిపోయెను.

## టర్కీ, ఇరాక్, ఇరాన్.

టర్కీ, జర్మనీలు ఆర్థిక, వాణిజ్య సౌకర్యములగురించి పరస్పరము ఒడంబడికను గావించుకొనుటకు త్వరలోనే సంప్రదింపులు ప్రారంభమగునని తెలియుచున్నది.

7 జర్మను వైమానికులు, 3 ఇటాలియను వైమానికులు 7 వ తేదీన విమానములో ప్రయాణమొనర్చుచు, విమానము చెడి టర్కీలో దిగిరి. వారిని అధికారులు ప్రవాసము నందుంచిరి.

ఇరాక్‌లో తిరిగి సంపూర్ణముగు శాంతి పరిస్థితులేర్పడినవి. ట్రాన్సు జోర్డాన్ రాష్ట్రపరిపాలకుడగు ఎమీర్ అబ్దుల్లాగారు బ్రిటిషు విజయమును అభినందించుచు, అరబ్బీ జాతులకు బ్రిటనుకు యెల్లప్పుడునుగూడ గాఢమగు మైత్రిగలదని ప్రకటించిరి.

## తటస్థ దేశములు (రష్యా, స్పెయిను, ఐర్లండు వగైరా).

పోర్చుగలు ప్రభుత్వము అజోర్సుదీవులకు 5 వ తేదీన మరికొంత సైన్యమును పంపెను.

రష్యాయందు బ్రిటిషు రాయబారిగనున్న సర్ స్టాఫర్డు క్రిప్సుగారు 6 వ తేదీన మాస్కోనుండి బయలుదేరి స్వీడను మీదుగా బ్రిటనుకు తిరిగి వచ్చుచున్నారు. వీరు 11 వ తేదీన బ్రిటను చేరిరి. బ్రిటిషు ప్రభుత్వముతో కొన్ని విషయములగురించి సంప్రదించుటకుగాను వచ్చుచుండిరి. కొన్ని రోజులు ఇంగ్లండునందుండి తరువాత తిరిగి వెళ్లుదురు.

జర్మను-రష్యా సంబంధములు చెడినవనియు, ఇటీవల రష్యా అధికారులు జర్మనీయెడల కఠినముగా వ్యవహరించుచు ఒత్తిడి గల్గించుచున్నారనియు తెలియుచున్నది.

## దూరప్రాచ్యము.

చైనాలో దక్షిణ షాన్సీ రాష్ట్రమునను హొనాను రాష్ట్రపు ఉత్తర ప్రాంతమునను జరుగుచున్న యుద్ధమున, చాంగ్ కైషేకు సేనాని 23 డివిజనుల సైన్యమునకు స్వయముగ నాయకత్వము వహించి నడిపించెననియు చైనా సైన్యములు ఓడింపబడెననియు, 13 డివిజనులు పూర్తిగ నిర్మూలమయ్యెననియు మిగిలిన వానిలో 2/3 వంతులు హతులైరనియు జపాను అధికారులు ప్రకటించిరి. చైనాకు ప్రస్తుత రాజధానియగు చుంకింగుపైన 6 వ తేదిన జపాను విమానములు తీవ్రమగు దాడి సాగించినవి. అమెరికా, బ్రిటిషు రాయ

చార కార్యాలయములకు స్వల్పముగా ప్రమాదము తప్పెను. ఒక గుహయందు తలదాచుకొనియున్న 700 ప్రజలు ఊపిరి సలుపక మరణించిరి.

జపాను మంత్రివర్గము 5 వ తేదిన సమావేశమై అంతర్జాతీయ వ్యవహారములగురించి కొన్ని ముఖ్యమగు నిర్ణయముల గావించుకొనెను. అంతకుపూర్వము సైనికాధికారుల సమాలోచన సభయొకటి జరిగెను. 7 వ తేదిన ఫ్రెంచి, జర్మను రాయబారులును తరువాత బ్రిటిషు రాయబారియు జపాను విదేశాంగ మంత్రియగు మట్సుకాగారిని దర్శించి దీర్ఘముగ సంభాషించిరి.

తూర్పు ఇండియా (డచ్చి) దీవుల అధికారులు, జపాను కోరుచున్న ఆర్థిక వాణిజ్య హక్కులగురించి, 6 వ తేదిన సమాధానమొసగిరి. అది చాల అసంతృప్తికరముగ నున్నదని జపాను అధికారులనుచుండిరి. దూరప్రాచ్యమున జపాను స్థాపించుకొన నుద్దేశించిన నూతన వ్యవస్థయందు పాల్గొనను ద్దేశము తనకులేదని డచ్చి అధికారులు జపానుకు దెలిపిరి.

దూరప్రాచ్యమున అమెరికా సంయుక్త రాష్ట్రముల విధానమునందు యెట్టి మార్పును వుండదని కార్డెలు హల్లుగారు 6 వ తేదిన పత్రికా ప్రతినిధులయెదుట ప్రకటించిరి. యుద్ధానంతరము శాంతి పరిస్థితులు యేర్పడగనే చైనాలో తమకున్న ప్రత్యేక హక్కుల వదలుకొనెదమనిగూడ హల్లుగారు దెలిపిరి. 11 వ తేదిన బ్రిటిషు పార్లమెంటులో సహాయకార్యదర్శి సమాధానమిస్తూ బ్రిటనుగూడ అమెరికాపద్ధతి ననుసరించు ననిరి.

# సిరియా యుద్ధ ప్రారంభం.

## స్వతంత్ర ఫ్రెంచి సేనలు ప్రవేశించుట.

## సిరియా, పరిసర ప్రదేశముల చరిత్ర.

ఈ యుద్ధంలో ప్రధాన ఫలితములు చేకూర్చగల యుద్ధం సిరియా, లిబినానులందు జరుగవచ్చును. ఈ దేశముల లోనికి బ్రిటిషు సామ్రాజ్య సేనలు, స్వతంత్ర ఫ్రెంచి సేనలు ప్రవేశించినవి. తూర్పు దేశాలకు జర్మనీ పోదలచిన దారికి ప్రక్కగ సిరియాకలదని దేశపటము చూడగానే తెలియగలదు. ఈ దేశం అక్షరాజ్యాల వశమయినచో మధ్యధరా సముద్రంలోను, చేరువ ప్రాచ్యదేశములందుగూడ మిత్రమండలికి ముప్పుగనుండును. క్రీటుపోతే పోయిందిగాని, మధ్యధరాసముద్రమునందు అక్షరాజ్యాలుకాక బ్రిటను అధికారం వహించియుండుట గొప్ప అదృష్టమే. సముద్ర మార్గాలు స్వాధీనంలో లేనిది, సముద్రాలపై అధికారం చలాయించే శక్తిలేనిది, సిరియాలోచేరను జర్మనీ ఎక్కువ అల్లరి చేయజాలదు. మిత్రమండలివారుగాని సిరియాను ఆక్రమిస్తే, చేరువ ప్రాచ్యదేశములకు సముద్ర మార్గాలు, నేల మార్గాలుగూడ తమ వశమునందే ఉంచుకొని సముద్రంపై తమ అధికారమును వృద్ధిచేసుకోగలరు. సిరియాలో ప్రధాన నగరమగు డమస్కసు అరబ్బ జాతియతకు కేంద్రస్థానం. అది ఎవరి వశమందుంటే వారి గౌరవాధికారములు ఎక్కువగనుండును. అది వశంకాకున్న మిత్రమండలిపై అరబ్బులు తిరుగుబాటుచేయ ప్రచారం చేయుటకు జర్మనీ ఇటలీలకు అవకాశముండదు.

### అరబ్బులు బ్రిటిషు పక్షమే.

అరబ్బులు బ్రిటిషువారియెడల సానుభూతి కల్గియున్నారని యీ యుద్ధంలో స్పష్టమయింది. ఇరాకులో జర్మనుల ధన సహాయంవలన బహు కొద్దికాలం రషీదాలి తిరుగుబాటు చేస్తే చేసేడు కాని, అరబ్బ లోకమంతా జర్మనీ ఇటలీవల ఓటమే కోరుచున్నదనుటకు సందేహంలేదు. బ్రిటిషువారి హయాంలోను, విషీ ప్రభుత్వం రాక పూర్వం ఫ్రాంసు హయాంలోను, తాము సంపాదించిన రాజకీయ హక్కులుకూడా అక్షరాజ్యాలు గెలిస్తే గోల్పోవలసి ఉంటుందని అరబ్బు లెరుంగుదురు. ముసోలిని "ఇస్లాము రక్షకుడను" బిరుదు తగిలించుకున్నా, అతని సేనాధిపతియగు మార్షలు గ్రేజియాని ప్రాచ్యదేశములను పాలించుటలో రాక్షసుడను బిరుదు సంపాదించెను. ఆ విషయం అరబ్బులకు బాగా తెలుసు. ఇక జర్మను నాజీలకు జాత్యభిమానం, అన్యజాతిద్వేషం విపరీతంగా ఉన్నందున, వారి చేతులలో తమ కెక్కువన్యాయం దొరకునని అరబ్బులాశించుటలేదు.

### సిరియా చరిత్ర.

ఆదివరకు టర్కీ సామ్రాజ్యములోచేరిన తొమ్మిది దేశాలు 1920-21 వ సంవత్సరములో సంధి షరతుల ప్రకారం వేరువేరు రాష్ట్రాలుగ నేర్పరుచబడి జాతి సమితి అధికారం క్రింద మాండేటరీ పరిపాలన కింద నుంచబడినవి. అవేవన: టర్కీ, సౌడి అరేబియా, ఈమెను, ఇరాకు, ఈజిప్టు, ట్రాంసుజార్డానియా, పాలస్తీనా, లిబినాను. సిరియాగూడ వీటిలోనిదే. ఇపుడు మనకు వీటిలో సిరియా లిబినాను, పాలస్తీనా, ట్రాంసుజార్డానియా యను నాల్గు దేశాలగూర్చియే కావలసియున్నది. మధ్యధరా సముద్రం తూర్పు తీరమున పాలసినాకు ఉత్తరంగావున్న సిరియా, విస్తీర్ణం 58,000 చదరపు మైళ్లు. 3,400,000 జన సంఖ్య. ఎక్కువమంది అరబిక్ భాష మాట్లాడేవారు. గత యుద్ధానంతరం, సిరియాను టర్కీ సామ్రాజ్యనుండి విడదీసి ఫ్రాంసు స్వాధీనంలోనుండు మాండేటరీ పరిపాలనక్రింద (అంటే జాతిసమితి తరఫున ధర్మకర్తగా ఫ్రాంసు పరిపాలించుట) నుంచబడినది. 1920 వ సంవత్సరములో సిరియాలోనున్న అరబ్బుల మహాసభయందు, హెజ్జాజు రాజు హుస్సేనుగారి కుమారుడగు ఎమిరు ఫైజులుగారిని సిరియా రాజుగ ఎన్నుకొనిరి. ఈతడు యుద్ధంలో మిత్రమండలి పక్షమునసుండెను. కాని మిత్రమండలివారు యీ యెన్నికను ఆమోదించనందున ఫైజులు దేశం విడచిపోయి తరువాత ఇరాకు రాజయ్యెను.

ఫ్రాంసు పాలనక్రింద సిరియా నాల్గు రాష్ట్రాలుగ విభజింపబడియుండెను.

1. సిరియా రాష్ట్రం—49,000 చదరపు మైళ్లు. జన సంఖ్య. 2,000,000. ముఖ్యపట్నం డమస్కసు.

2. లిబినాను—3,800 చదరపు మైళ్లు. 700,000 జన సంఖ్య, క్రైస్తవులు అరబ్బులు. బైరూటు ముఖ్యపట్నం. ఫ్రెంచి ప్రభుత్వ కేంద్ర స్థలంకూడా బైరూటు.

3. లటాకియా—2,800 చదరపు మైళ్లు. జన సంఖ్య 350,000. అలోనైటు జాతివారు.

# సిరియా యొక్క ప్రదేశ పటము

కొలత 1 అంగుళము = 80 మైళ్లు




Reg. No. 65/3 Copies 11700

Haliozinco., Survey Office, Madras. 1941.

4. జాబెలు ద్రూసు—2,400 చదరపు మైళ్లు. జన సంఖ్య 50,000. యుద్ధప్రియులగు ముస్లిములు.

వీరు కాక సదా తిరుగుచుండు బిడోవిను జాతివారు 300,000 గలరు. ఈ నాల్గు సిరియాదేశపు రాష్ట్రములకు యిపుడు రాజకీయ సంబంధం ఏమిలేదు. అన్నీ ఫ్రెంచి మాండేటరీ పాలనక్రింద ఉన్నాయి. అంతే. పరస్పర సంబంధం లేదు. ఆదివరకు సిరియను ఫెడరేషను (సమాఖ్య ప్రభుత్వం) 1924 వ సంవత్సరములో రద్దుచేయబడింది. అలగ్జాండ్రెట్టా అను టర్కీ సరిహద్దు చేరువనున్న నగరాన్ని ఫ్రాంసు 1938 వ సంవత్సరములో టర్కీకి యిచ్చివేసింది.

చేరువనున్న ఇరాకుదేశం బ్రిటిషువారి మాండేటరీ పరిపాలనక్రింద ఉంది. అచటి ప్రజలకు ఇంగ్లాండు స్వాతంత్ర్యం యిచ్చియుండుటచే, సిరియాలోని అరబ్బులు, తమకు స్వాతంత్ర్యం కావాలని ఫ్రాంసుపై తిరుగబడిరి. 1925 వ సంవత్సరములో ప్రారంభమయిన తిరుగుబాటు యిటీవలి వరకు ఏదో రూపంలో ఉంటూనేఉంది. 1936 వ సంవత్సరములో ఫ్రాంసునందు బ్లూముగారి సోషలిస్టు ప్రభుత్వం సిరియాకు, లిబినానుకు మూడేండ్ల తరువాత సంపూర్ణ స్వాతంత్ర్యం యిచ్చివేస్తామని సంధి పత్రములందు సంతకం చేసెను. కాని యీ సంధి ఫ్రెంచి పార్లమెంటు యీలోగా నమోదు చేయాలన్నారు. పార్లమెంటు ఆమోదించడం ఆలస్యమయినందున, సిరియా ప్రజలలో అసంతృప్తి పెరిగింది. 1939 వ సంవత్సరములో సిరియను శాసనసభయందు, "యికముందు సిరియా సంపూర్ణ స్వాతంత్ర్య దేశం కావున అన్ని అధికారములు సిరియా ప్రభుత్వమే ఫ్రాన్సునుండి తీసుకొనవలెను" అని తీర్మానించబడెను. 1939 వ సం॥ ఫిబ్రవరిలో సిరియా-ఫ్రాంసు సంధి పత్రములను ఫ్రెంచి ప్రభుత్వం నమోదు చేయరాదని నిశ్చయించుటచే, డమస్కసునందున్న సిరియా ప్రభుత్వమునందు భిన్నాభిప్రాయములేర్పడి రాజీనామా నిచ్చెను. సిరియా జాతీయవాదులు తీవ్రముగ ఆందోళన ప్రారంభించి, దేశంలో అరాచకంగా ఉంటే, ఫ్రెంచి హైకమిషనరు 1939 వ సం॥ జూలై నెలలో సిరియా రాజ్యాంగ విధానమును రద్దుచేసి సర్వాధికారములను స్వీకరించెను.

ఇపుడీయుద్ధం రావడం, ఫ్రాంసు జర్మనీ వశమవడం సిరియాను చాల కల్లోలపరచెను. ఫ్రాంసు పడిపోయిన తరువాత సిరియాలో ఫ్రెంచి సేనల నాయకుడగు వేగాండు సేనాని బదులుగ వచ్చిన జనరలు యాజిను మిటిలు హోసరుగారు జర్మనీకి లొంగిపోవుట యిష్టం లేక యుద్ధం కొనసాగించవలెననియే నిశ్చయించెనని ప్రకటింపబడెను. కాని నాల్గు రోజులు తరువాత అతనికి పార్సుగారికి జరిగిన ఒడంబడిక ప్రకారం సిరియాలో శతృత్వాలు విరమింపబడినవనియు, ఫ్రాంసు పతాకం క్రిందనే సిరియాలోనున్న ఫ్రెంచి సేనలు ఆ దేశసరిహద్దులను, ఎవరి దాడినైనా ఎదుర్కొని కాపాడదలచినవనియు తెలుపబడెను. ఈ నిర్ణయం ఫ్రాంసులోను సిరియాలోనుగూడ అసంతృప్తికి కారణమైనది. రెండు పార్టీలేర్పడి కొందరు మార్షలు పిటేను ప్రభుత్వంక్రిందనుండాలని, మరికొందరు జనరలు డిగాల్ బ్రిటనుల పక్షముండాలని కోరిరి. సిరియాలోని ఫ్రెంచి సేనలు, ఉద్యోగులు దేశంవిడిచి పాలస్తీనాపోయి బ్రిటిషువారి పక్షం చేరిరి. ప్రజలుకూడా గ్రామాలు విడచిపోతూవుండడం ఎక్కువకాగానే, ఫ్రెంచి హైకమిషనరు అలాపోయినవారికి శిక్షలు విధింపసాగెను. ఫ్రెంచిసేన 20,000 వరకు తగ్గిపోయెను. దాని తనికీచేయుటకు ఇటలీ నుండి ఒక సైనిక రాయబారవర్గంవచ్చెను. ఫ్రాంసునుండి తమ బానిసత్వమును ఇటలీ తప్పిస్తుందేమోనని సిరియనులు కొందరాసించిరి. కాని ఇటలీ సైన్యాలు గ్రీకులచేతను, బ్రిటిషువారిచేత ఓడింపబడుచుండగ, తమ భాగ్యభాగ్యము బ్రిటను పైనే ఆధారపడియున్నదని సిరియనులు గుర్తింపసాగిరి. ఫ్రాంసుతో వర్తక బహిష్కారమును దిగ్బంధమును ఇంగ్లాండు అమలు జరిపినందున సిరియాగూడ ఆర్థికదుస్థితికి లోనైనది.

## బ్రిటిషువారి అభయం.

విషీలోనున్న పెద్దలు ఫ్రాంసుయొక్క గౌరవ ప్రతిష్టలను అమ్మివేసిరి. ఆదివరకు తమ మిత్రులకు ప్రతికూలంగా జర్మనీతో పరీకు అవుతున్నారు. జర్మనీ ఒత్తిడివల్ల తాము జాతిసమితినుండి విడబడినా, సమితిద్వారా తమకు లభించిన సిరియాలో జర్మను యుద్ధభటులను దుండగులను ప్రవేశపెట్టుటకు వారికెట్టి హక్కులేదు. జర్మను సేనలు వైమానికులు సిరియాలో ప్రవేశించుచున్నారని ఎన్నో వార్తలు వస్తున్నాయి. కేవలం స్వరక్షణకొరకు, ముందు కాపుదలకే స్వతంత్ర ఫ్రెంచి సేనలు బ్రిటిషు సామ్రాజ్య సేనలతోకూడ యీ నెల 9 వ తేదిన సిరియాలోను లిబినానులోను ప్రవేశించినవి. స్వతంత్ర ఫ్రెంచి సేనానాయకుడు జనరలు కాట్రోగారు, జనరలు డిగాలు తరఫున సిరియా, లిబినాను దేశాల స్వాతంత్ర్య రక్షణకు పూచీపడుచు ఒక ప్రకటన గావించెను. బ్రిటిషు ప్రభుత్వమువారు దానిని బలపరచుచు యిట్లు ప్రకటించిరి: "మధ్యప్రాచ్య దేశముల స్వాతంత్ర్యమును రక్షించుటకు బ్రిటిషు ప్రభుత్వం పూచీపడింది కావున, వాటిపై దాడి సలుపుటకు సోపానంగా ఉపయోగించుటకు శత్రు సైన్యాలు సిరియా, లిబినానులకు ఆక్రమించకూడా చూస్తా"మని బ్రిటిషు ప్రభుత్వంవారు 1940 వ సం॥ జూలయిలో ప్రకటించియుండిరి. విషీ ప్రభుత్వంవారు జర్మనీతోచేర సిరియా, లిబినానులందలి విమానాశ్రయములను జర్మనీ ఇటలీలకు యిచ్చి, ఇరాకులోను తిరుగుబాటు సేనలకు యుద్ధపరికరాలుగూడ యిచ్చియుండిరి. జర్మను సేనలు చల్లగా సిరియాలో ప్రవేశిస్తున్నాయి. క్రమేణ యీ రెండు దేశాలు జర్మనీవశం చేయుటకు విషీప్రభుత్వం తగు యత్నాలు చేస్తున్నది. ఫ్రెంచి యుద్ధవిరామ సంధి పరతులకును, మార్షలు పిటేను ప్రకటనకు విరుద్ధమగు యీ చర్యలను ఇంగ్లాండు సహించదు. కావున బ్రిటిషు సామ్రాజ్య సేనల సహాయంతో స్వతంత్ర ఫ్రెంచి సేనలు 9 వ తేదిన సిరియాలో ప్రవేశించినవి. అదే సమయాన జనరలు కాట్రోగారు సిరియా, లిబినానుల స్వాతంత్ర్యమును రక్షించెదననియు అందుకు తగు సంధిరాయబారాలు కొనసాగింతుననియు తెల్పుచు యీ దిగువరీతి ప్రకటించిరి:—

## స్వాతంత్ర్యం ఒసంగుట.

సిరియా-లిబినాను ప్రజలారా!

బ్రిటిషువారి సేనాసహాయమున స్వతంత్ర ఫ్రెంచి సేనలు మీదేశంలో ప్రవేశించుచున్న యీ సమయాన ఫ్రెంచి స్వతంత్ర ప్రజల తరఫున, డిగాలు సర్వసేనాధిపతి తరఫున నేను అన్ని బాధ్యతలను వహించుచున్నాను. మీదేశంలో మాండేటరీ ప్రభుత్వమును అంతమొందించి మీకు స్వాతంత్ర్య మొసంగుటకే వచ్చితిని. ఇకముందు మీరు స్వతంత్రంగా నుండి ప్రత్యేక రాష్ట్రములుగా నేర్పడవచ్చును, లేదా రెండు కలసి ఒక రాజ్యంగా నేర్పడవచ్చును. ఇకముందు మీస్వాతంత్ర్యము మాచే సంతకం చేయబడు సంధి పత్రముద్వారా

స్థిరమొనర్చబడును. మీ ప్రతినిధులు నేను త్వరలో యీ ఒడంబడిక గావించుకొందుము. అంతవరకు కలసి సమిష్టిగా శత్రువు నెదర్కొందము. మీ స్వేచ్ఛను స్వాతంత్ర్యమును కాపాడుటకేగాని దోచుకొనుటకు మేము రాలేదు. హిట్లరు సేనలను తరిమివేయుటకును, బ్రిటిషువారిని కొట్టుటకు శత్రువుల విమానకేంద్రంగా ఫ్రాంసు సామ్రాజ్యం మారిపోకుండ జేయుటకును నేను వచ్చితిని. ప్రజల స్వాతంత్ర్యంకొరకు పోరాడుచున్న మేము, మీ దేశాన్ని క్రమేణ అణచివేసి, మీ ఆస్తులు శరీరం అంతటిపై అధికారం వహించి మిమ్మల్ని బానిసలుగా చేయజాలము. మీ దేశం శత్రువులవశం అయిపోతూంటే చూస్తు ఊరుకోలేం. మీరు మాతో చేరినచో బ్రిటిషు ప్రభుత్వం తనతో చేరిన స్వతంత్ర దేశాలన్నింటికి ఒసంగిన సౌకర్యాలన్ని మీకు ఒసంగుటకు అంగీకరించినది. మీ దేశానికి దిగ్బంధం తొలగి స్వేచ్ఛగ వ్యాపారం చేసుకోవచ్చు. మీ ఆర్థికమాంద్యం తొలగును. మీ ప్రాణాలకొరకు మానవ కల్యాణం కొరకు పోరాడుచున్న తన బిడ్డల ద్వారా ఫ్రాంసు మీరు సర్వ స్వతంత్రులని ప్రకటించుచున్నది.”

ట్రాంసు జోర్డానియా.—పాలస్తీనా, ఇరాకు, సిరియా, సౌడి అరేబియాలకు మధ్యగా ఉన్నదీ రాజ్యం. దీని ముఖ్యరేవు స్థలం క్వాబా అనునది సూయజు కాల్వకు గల నీటిమార్గం నేలమార్గములు రెండింటికికూడ లిప్తలంగాఉంది. గతించిన హెడ్జాజురాజు హుస్సేనుగారి 3 వ కుమారుడు ఎమిరు అబ్దుల్లా దీన్ని పాలించుచున్నాడు. కొండజాతుల వారినుండి యీ దేశాన్ని బ్రిటను రక్షిస్తున్నందున, అమీరు యీ యుద్ధంలో బ్రిటిషువారి పక్షమున్నాడు. ఇరాకు రీజెంటునకు యీతడే యిటీవల ఆశ్రయమిచ్చెను.

పాలస్తినా.—1917 వ సంవత్సరమున యీ దేశాన్ని అలెనుబి సేనాని ఆక్రమించెను. అప్పటినుండి బ్రిటిషువారి మాండేటరీ పరిపాలన క్రింద ఉన్నది. ఇటీవలవరకు యీ దేశంలో అరబ్బులు యూదులు బద్ధవైరులుగానుండి పోరాడుకొనుచుండిరి. రెండు జాతులవారి హక్కులకు భంగంరాకుండా ఉభయుల అధికారం ఉండే ప్రభుత్వంతో పదేండ్లలో స్వతంత్ర పాలస్తినా రాజ్యం ఏర్పరుచడమే బ్రిటిషువారి ఉద్దేశమని 1939 లో పార్లమెంటు ప్రకటించెను. యుద్ధం రాగానే అరబ్బులు—యూదుల పోరాటం వెనుకబడి, ఉభయులు బ్రిటిషువారి పక్షం ఉన్నారు.

# క్రీటు యుద్ధం శల్య పరీక్ష.

### విమర్శలకు చర్చిలు ప్రధాని జబాబు.

బ్రిటిషు పార్లిమెంటు సభలో 10 వ తేదిన ప్రధాన మంత్రి చర్చిలుగారు క్రీటు యుద్ధంలో ఓడి పోవుటకుగల కారణాలు తెల్పిరి. ఈ యుద్ధం గూర్చి ఆదివరకు పత్రికలందును, ఆ నాడు సభలోను తీవ్రమగు విమర్శలు వెలువడెను. వాటన్నింటికి బదులు చెప్పుచు ప్రధాన మంత్రిగారు, రాబోయే ఆరు మాసాలలోను ప్రస్తుతం యేర్పడి యున్న పరిస్థితులకంటె హీనమయిన పరిస్థితులు మనకు ఏర్పడకుండా ఉండేయడల బ్రిటిషు సైనిక చరిత్రలో ఇది ఉత్కృష్టమయిన అధ్యాయమనియే చెప్పవలెననిరి.

విమర్శలవలన కలుగు నష్టమును గూర్చి వారిట్లు చెలిపిరి :—ఇది క్రూరయుద్ధం. చుట్టూ ఉపద్రవాలు అపూర్వమైనవి. అనంతంగా ఉన్నవి. రక్షించవలసినవి చాలా వున్నవి. సంపత్తి కొంచెమే. అవకాశాలు మనకు ఎదురు తిరుగవచ్చు. ఇలాంటి సమయంలో పార్లమెంటు సభ్యులు జాగ్రత్తగా మాట్లాడితే బాగుండును. నిరాశా సూచన మాటలు విని, స్నేహితులు నిరుత్సాహపడతారు. శత్రువు ఆ మాటలనే శతాధికంగా ప్రచారం చేస్తాడు. నియంతల రాజ్యాలలో యీ విమర్శలకు జబాబు చెప్పవలసిన బాధ్యత లేదు. ప్రజా సేవకుడ నగుటచే అడుగడుగున నేను సంజాయిషి చెప్పకుంటూ ఉండాలి. కాని శత్రువునకు లాభంకరంగా ఉండేటటువంటి విషయాలు నేనె వెల్లడించవలెనని సభ్యులు ఆశించరను కొందును.

క్రీటులో విమానాశ్రయములను ఖాళీ చేసి పోవడం ఎందుకని విమర్శిస్తున్నారు. విమాన ప్రతిఘటన ఫిరంగులు లేనిది విమానాశ్రయములను కాపాడుట కష్టమను విషయం అందరెరుంగుదురు. స్వదేశ రక్షణకు లేకుండా ఆ ఫిరంగులను మధ్య ప్రాచ్యదేశమునకు పంపలేముకదా. గత ఆరు నెలలుగా స్వదేశం పైని కూడా విమాన దాడి జరుగుచునే యున్నది. పైగా యే యుద్ధ సామగ్రి క్రీటుకి పంపాలన్న ఆఫ్రికానుచుట్టి కేపుమార్గాన పంపాలి. మూడు నెలలవరకు ఆ ఆయుధాలు నిరుపయోగంగా ఉంటాయి. శత్రువునకు యూరోపులో విమానాశ్రయాలన్ని వశమయి యున్నందున సరాసరి క్రీటులో ఎగిరివచ్చి పడగలవు. మనవిమానాలు స్టీమరులపై రవానాచేసి క్రీటు చేరవకు తెచ్చి అక్కడ సంధించాలసి ఉండెను. క్రీటుకు పంపుటకు మన కొన్ని విమానాలు, విమాన విధ్వంసక ఫిరంగులు ఊరికే పడియుండలేదు. మన సరకు ఆ ప్రాంతాలు చేరుటకు కొన్ని వారాలు పడితే, జర్మనుల సరకు కొద్దిరోజులలో చేరగల్గుచున్నది. అయినా మధ్య ప్రాచ్య దేశమునందు విమానదళం పెంచుటకు సకలయత్నములు జరుగుచున్నవి.

గ్రీసు ఓడిపోయిన తరువాత క్రీటులో గ్రీసు ప్రభుత్వం చేరి అదీని రక్షించుకొనుటకు మన సహాయం కోరినపుడే మన విమాన శక్తి చాలదని తెలుసు. తెలిసియు ఎందుకచట యుద్ధానికి దిగి నష్ట పొయేరని కొందరడుగవచ్చు. మనం రక్షించుకోలేని స్థలాలు యుద్ధం చేయకుండానే విడచి పెట్టాలన్న సిద్ధాంతం అంగీకరిస్తే, శత్రువు ఎట్టి నష్టం లేకుండా అన్ని దేశాలు ఆక్రమిస్తాడు. గ్రీసు, క్రీటులలో మనం యుద్ధం చేయకుండా ఉండియుంటే, యీపాటికి సిరియా, ఇరాకు జర్మనులాక్రమించి పెర్షియాపై దాడికి సిద్ధంగా ఉండును. ఎన్ని ఆటంకాలున్నా స్థానికంగా ఎన్ని అసౌకర్యాలున్నా, ఆ విపరీత పరిస్థితులలోకూడా శత్రువులను మొండిగా అకుంఠిత దీక్షతో ప్రతిఘటించడం విజయ సాధనలో ప్రధానాంశం అవి పదేపదే రుజువై యున్నది. గత యుద్ధంలో మిత్రమండలివారు ప్రమండుకోట పెమలుమిట్టను గోల్పోయినారు. కాని ఆ పోరాటాన్ని, అసలు యుద్ధాన్ని పోగొట్టుకోలేదు. ఇపుడు క్రీటు యుద్ధంకూడ అట్టిదే. క్రీటులో ఆస్ట్రేలియా న్యూజిలండు సైనికులెక్కువ పోయిరని విచారంగా ఉంది. కాని అధినివేశ రాజ్యాల నష్టంకంటె బ్రిటిషవారి నష్టములే హెచ్చు. ఈ లెక్కలో భారతీయులుగాని బ్రిటీషేతరులుగాని చేరలేదు. క్రీటు యుద్ధమునకు మనము చింతింపరాదు. క్రీటులో జరిగినంత ఘోర యుద్ధమును మరెచ్చటను

జర్మనులు యెదుర్కొనియుండలేదు. జర్మనులకు 12 వేల సైన్యము, 180 విమానాలు, సైన్యాలను చేర్చే విమానాలు 25 నష్టమయ్యెను.

క్రీటుపై దాడి ఇంగ్లాండు దాడికి రిహార్సలుగా జర్మను లెంచుచున్నారనియు, అదేవిధంగా ఇంగ్లాండు పైబడగలరనియు కొందరందురు. ఇంగ్లాండులో విమానబలం ఎక్కువగానుంది. మన నావలకు క్రీటులోవున్న ప్రతిబంధకాలిచటలేవు. ఇచట గాలిగుమ్మటాలలో దిగువారప్పటికపుడు హతమార్చబడుదురు. కనుక ఇంగ్లాండు రక్షణకు క్రీటు యుద్ధం గుణపాఠం కాగలదు. ఏమి భయంలేదు.

సిరియా యుద్ధముగూర్చి చెప్పుచు, చర్చిలుగారు సిరియాలో తమకు రాజ్యాక్రమణకాంక్ష లేదనియు, సిరియాలో మన సైన్యములు ప్రవేశించుటవలన ఈజిప్టుపై శత్రుదాడి భయము తొలిగెననియు చెప్పిరి. శత్రువునకు సాధనసంపత్తి యెక్కువున్నందున, నైసర్గికముగకొన్ని వీల్లున్నందున, యుద్ధం త్వరగ ముగియునని కాని, సులభంగా విజయం కలుగునని కాని చెప్పజాలననిరి. ఇంగ్లాండు ఫ్యాక్టరీలలో ఉత్పత్తి చాలహెచ్చినదనియు, మన నౌకలు జర్మనీ నౌకలవలెగాక బాహాటంగా సముద్రాలలో తిరుగగల్గుచున్నవనియు, మాసము రోజులలో సూయజు ప్రవేశింతుమని జర్మనులు మూడు నెలలనుండి చెప్పుచుండిరనియు, ఆఫ్రికా, అబిసీనియాలందు విజయము పొందుచుంటిమనియు, ఒక్క క్రీటులో ఓడినంత మాత్రాన, యీ విజయాలన్ని మరచిపోరాదనియు, ప్రధాని తెలిపెను.

---

# యుద్ధంలో లాభ నష్టాలు

క్రీటును గోల్పోయినందుకు ఇంగ్లాండు, ఆస్ట్రేలియా, న్యూజిలండు దేశాలలో చాల గోలబయలుదేరుట సహజం. ఈ దేశాలన్ని ప్రజాప్రతినిధి ప్రభుత్వాలు గలవగుటచే దీనిగూర్చి చర్చలు బహిరంగంగానే జరుగును. అదీమేలే. క్రీటు పోయినందున మిత్రమండలివారికి మంచి నౌకాదళ విమానదళ శిబిరాలు పోయినాయి. మధ్యధరా సముద్రము పడమర భాగమునందు ఈజిప్టుకి అతిచేరువగా శత్రుస్థానమేర్పడినందున బ్రిటిషు నౌకాదళానికి శత్రువిమానదాడి ముప్పు ఎక్కువగను. క్రీటు సిరానైకాలకు మధ్య 200 మైళ్ల సముద్రంగలదు. కావున ఈజిప్టునుండి బ్రిటిషు విమానాలు ఆప్రాంతాన సులభంగా కాపలాకాయగలవు. క్రీటును రక్షిస్తున్న సైన్యానికి, శత్రు సేనలు రాకుండా అరికట్టుచున్న బ్రిటిషు నౌకాదళానికిగూడ స్వంత విమానశక్తి తక్కువగ నుండెను. ఆలోటు యిపుడు సరిచూడబడుచున్నది. ఇకముందు తగిన విమానదళ సహాయంలేనిది నేల సైన్యాలను పంపరాదని ఆస్ట్రేలియా న్యూజిలండుల ప్రజాభిప్రాయం ప్రకటింపబడినది. బ్రిటిషు పార్లమెంటులో క్రీటు విషయం చర్చింపబడునపుడుగూడ అనేక ప్రశ్నలు వేయబడెను. చర్చిలుగారు యథాప్రకారం ప్రజలందరికి తెలిసేటట్లు నిజం చెప్పేస్తారు. వారు ప్రజాభిప్రాయాన్ని మన్నించి అవసరమగు మార్పులు చేస్తారని యిటీవలి అనుభవంవల్ల తెలియగలదు. యుద్ధం జయప్రదంగా ముగించే సాధనలన్ని ఆలోచించి అమలు జరుపుతారు.

మిత్రమండలి సేనలు శత్రువుల డైవు బాంబరు (అంటే అతివడిగా ఆకస్మికంగా క్రిందకు దూకి బాంబులువేసి పారిపోవు విమానాల) దాడి నెదుర్కొని తీవ్రంగా పోరాడిన పిమ్మట విధిలేక క్రీటు విడువవలసివచ్చెను. నేల సైన్యాలకు విమానాల సహాయం లేనందున జర్మను విమానాలు వాటి నోడించినవి. ఇపుడు జర్మనులకు సిరియాపైబడుటకు కాలూనుకొను స్థలం దొరికింది. సూయజుకాల్వపై బడుటకు వేరొక మార్గం లభించింది. ఈ విజయం శత్రువులకు రహస్య ఆయుధాలవల్ల లభించలేదు. మామూలు గాలి గుమ్మటాలు, యంత్రంలేని జారే రెక్కల విమానాలు, సైనిక విమానాలు, డైవు బాంబరు విమానాలవలన గెలిచిరి. మిత్రమండలికిగూడ వీటి నెదుర్కొను సాధనాలు లేకపోలేదు. కాని క్రీటు నైసర్గిక పరిస్థితుల ననుసరించి వారు వాటిని ఉపయోగించలేకుండిరి. ఇంగ్లాండు రక్షణయందు యీలోపముండదు. క్రీటులో బ్రిటిషు నౌకాదళానికి రక్షణగ ఫైటరు విమానదళం తగినంత లేకుండెను. అందుచే శత్రుసేనలు నౌకాదళాన్ని దాటి ఆకాశంమీదుగా వచ్చి చేరగల్గినవి. సముద్రంలోనుండి సేనలను వాటికి సహాయం తీసుకవెళ్లుటకన్న ఆకాశంపై విమానాలలో పంపుట తేలిక.

## లాభాలు.

మధ్యప్రాచ్యదేశ యుద్ధం యింతతో ముగియలేదు. ఇంకా అంత్యదశకే రాలేదు. క్రీటులో శత్రువులను కొంతకాలం నిరోధించుటవలన, మధ్యప్రాచ్యదేశమునందు సైనికశక్తి పెంచుటకు వ్యవధి చేకూరెను. దక్షిణాఫ్రికానుండి ఈజిప్టుకి ఎక్కువ సేనలు వస్తున్నాయి. బ్రిటిషువారి యుద్ధనీతి ఏమంటే, ముఖ్య కేంద్రమును రక్షించుటకు సైన్యాని ఎక్కువగ నేకరించుకొనుచుండునంతవరకు దూరాన్న ఉన్న శిబిరాలవద్ద శత్రువులను వీలయినంత దీర్ఘకాలం అరికట్టియుంచుట. కేంద్ర శిబిరానికి చుట్టునుండు దుర్గములవంటివి గ్రీసు, క్రీటు, సిరనైకాలు. కేంద్రమున సైనికశక్తి వృద్ధిచేసుకొనుటకు వ్యవధియొసంగుటకై వీలయినంత ఎక్కువ కాలం శత్రువును అరికట్టియుంచుటే యీ దుర్గాలపని. ఈ నష్టాలు చాల ఎక్కువే అయినప్పటికి, యిందుకు బదులుగ అబిసీనియాను గెలిచేమని, ఇరాకులో రషీదాలి పరారియగుటవలన సరిఫరాకు లోటురాలేదని, మటపంవద్ద ఇటలీ నౌకాదళాన్ని రూపుమాపేసేమని మరచిపోవద్దు.

మధ్యధరాసముద్రం, అట్లాంటికు యుద్ధాలు యింకా జరుగుతున్నాయి. నౌకల నష్టం ఎక్కువగుచున్నది. హుడు యుద్ధనౌక మునిగిపోతే, జర్మనీవారి బిస్మార్కు ముంచబడింది. స్కారనుహోర్స్టు, గ్నిసాను అనునవి కదలకుండా చేయబడినవి. అమెరికా సహాయం ఎక్కువగా వస్తున్నది. సరకునకు వారి కాపలా జయప్రదంగా ఉంది.

## 1940 లో—1941 లో.

1940 వ సంవత్సరములోను 1941 వ సంవత్సరములోను జరిగినవి సరిపోల్చి చూచుకోవచ్చును. నిరుడు యీ నెల సరికి నార్వే, డెన్మార్కు, హాలెండు బెల్జియములను జర్మనీ ఆక్రమించింది. డన్‌కర్కును ఖాళీచేసేం. బ్రిటను చాలసరకు నష్టపోయింది. ఫ్రాంసు పడిపోసిద్ధంగా ఉండెను. ఇటలీ యుద్ధంలో చేర సంసిద్ధంగా నుండెను. నార్వే

యుద్ధంలో జర్మను యుద్ధనౌకలు 12, క్రూజరులు 4 ముంచబడినవి. ఈ వత్సరం యుగోస్లావియా, గ్రీసు, సిరనైకా, క్రీటులను జర్మనులు వశపరచుకొనిరి. నౌకానష్టాలు ఎక్కువగనుండెను. హుడు అను యుద్ధ నౌక మునిగింది. కాని అబిసీనియాలో ఇటలీ సైనికులు 5 లక్షలమంది నాశనంచేయబడిరి. ఇరాకునుండి రషీదాలి పారిపోయెను. మిగిలియున్న ఇటలీ నౌకాదళం దాగొనియున్నది. జర్మనుల బిస్మార్కు యుద్ధనౌక ముంచబడింది. అమెరికా సహాయం బాగావస్తున్నది. నిరుడీపరికి జర్మను విమానశక్తి, నేల సైన్యం మనవాటికన్న చాల ఎక్కువగ నుండెను. నేడు మన విమానశక్తి వారితో సరిసమానమగుచున్నది. నేలసైన్యం అతివడిగా వృద్ధియగుచున్నది. జర్మనుల రహస్య ఆయుధాలేవి బయల్పడలేదు కాని మిత్రమండలివారి అతిబరువైన బాంబులను క్రొత్తరకం ఫైటరు విమానాలు శత్రువులను హడలుకొట్టేయి. నిరుడు జర్మను గూఢచారుల అల్లరి చాలయుండెను. ఇపుడది తగ్గినది. మిత్రమండలి సఖ్యత, శక్తిబాగా వృద్ధియగుచున్నవి. జర్మనీ ఎంతఎక్కువ ఆయుధాలు తయారుచేయగలదో అంత ఎక్కువ అపుడే తయారుచేస్తున్నది. ఇంతకు మించలేదు. కాని బ్రిటిషువారి ఉత్పత్తి శక్తి నానాటికి హెచ్చుచున్నది. అమెరికా సహాయంకూడ వృద్ధియగుచున్నది. జర్మనీ ఇంగ్లాండును ఓడించాలంటే బ్రిటిషు దీవులలోనే ఓడించాలి. ఆ దీవులపై దాడి ఆలస్యమయినకొలది జర్మనీ గెలిచే అవకాశాలు తగ్గిపోతూ ఉంటాయి. నిరుడు అమెరికా అనుమానాలతో గోడమీద పిల్లి వాటుంగా ఉండెను. ఈయేడు అమెరికాలో ప్రజాభిప్రాయం ఇంగ్లాండుకు అనుకూలంగామారి, అవసరమైతే యుద్ధంలో దిగాలంటున్నది. హుడు యుద్ధనౌకపోతే బ్రిటిషువారి నౌకాశక్తిలో 1/16 వ వంతు పోయింది కాని, బిస్మార్కు పోవడంవలన జర్మనీ నౌకాశక్తి 1/6 వంతు తగ్గింది.

## ఇటాలియను సామ్రాజ్యం నిర్మూలమైనది.

అబిసీనియా యుద్ధం ఇంచుమించు పూర్తియగుచున్నది. ఈజిప్టు రక్షణకు ఇందువలన కలిగిన సౌకర్యం ఇంత అంతా అని చెప్పుటకు వీలులేదు. తూర్పు ఆఫ్రికాలో ఇటాలియనుల నిర్మూలించుటవలన ఈజిప్టునకు వెనుక వైపునుండి ఉపద్రవం తొలగింపబడింది. వేలకొలది సుశిక్షితమగు సైన్యాన్ని తూర్పు ఆఫ్రికా ప్రాంతమునుండి ఈజిప్టు రంగమునకు మార్చుకొనుటకు బ్రిటిషువారికి అవకాశంగలిగినది. వేవలు సేనాని ఇక — శత్రులకు ఇంకను సైన్యాలను తెచ్చుకొను అవకాశ మొసగకుండ, తానే లిబియారంగమున శత్రులపై దాడి ప్రారంభింపవచ్చును.

టానా సరస్సు ప్రాంతపు జిల్లాలలో ఇంకను అక్కడక్కడ నిలచియున్న ఇటాలియను సైన్యాలను, బ్రిటిషు పటాలాలు చుట్టుముట్టి నిర్మూలిస్తున్నాయి. ఇటాలియనులు డుబ్రీచ్ దుర్గమును వదలి గోండార్ దుర్గం వైపునకు వెనుకకు పోవుచున్నారు. ఆ ప్రాంతమున నాల్గువైపులనుండి బ్రిటిషు సైన్యములు కమ్ముకొని వచ్చుచున్నవి. అందుచే, అచటనున్న 7,000 ఇటాలియను సైన్యంలొంగి పోవచ్చును ఇవిగాక అబిసీనియా యందచ్చటచట ఇంకను 42 వేల ఇటాలియను సైన్యంవున్నదను విషయమును మరచి పోరాదు. వీరు ప్రతి దినం వందలకొలదిగా బ్రిటిషు సైనికులకు లొంగి పోతున్నారు. వీరి నందరిని పట్టు కొనుటకు కొంత కాలం పట్టుట సహజం.

లిబియాలో, శత్రుకేంద్రమగు బెన్‌ఘాజీ రేవుపైన బ్రిటిషు విమానములు దాడులు సల్పి శిథిలం చేస్తున్నవి. టొబ్రూకు రేవు దుర్గం ఇంకను బ్రిటిషు సైన్యాల స్వాధీనంలోనేవుంది. శత్రువులు లిబియానుండి ఈజిప్టువైపుకి ముందుకు సాగితే, టొబ్రూకుమీదుగా బ్రిటిషు సైన్యాలు వెనుకనుండి పైబడునని శత్రులకు భయం. సోలం దుర్గం ఇంకా జర్మనుల చేతులలోనేవుంది. కాని లిబియావంటి ఎడారి ప్రాంతాలలో విజయాలను, నష్టబడిన సైనిక సంఖ్యలబట్టి ఆయుధాలనుబట్టి నిర్ణయించాలిగాని ఏదో ఒక పట్టణాన్ని బట్టికాదు. ఆ ప్రకారం చూస్తే ఏమి కనుపిస్తుందో చూడండి. ముసులోనీ యొక్క తూర్పు ఆఫ్రికా సామ్రాజ్యమంతయు పోయింది. మంచి ఆయుధ సంపన్నము సుశిక్షితము అగు 3 లక్షల సైన్యము, 1,000 ఫిరంగులు, వందలకొలది టాంకులు అపారమగు మోటారు బండ్లు, విమానదళముకూడ పూర్తిగా పోయినది. నేడు ముసులోనీ కంటె దీనుడు మరియొకడు లేడు. సైన్యము, ఆయుధములే కాకుండ 700,000 చదరపు మైళ్ల విస్తీర్ణంగల అతని సామ్రాజ్యం పోయినది. అతని సైన్యంలో 120,000 మంది బ్రిటిషువారికి ఖైదీలుగాచిక్కిరి. 1,25,000 మంది వదలి పారిపోయిరి. 65,000 మంది హతులైరి. యుద్ధ సామగ్రి అంతా బ్రిటిషు సైనికులచే జిక్కింది.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.